The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper for H. E. H The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

తూర్పు బజారు, హైదరాబాదు, (దక్కన్.)

ప్రతి సోమ, గురువారములు ప్రకటింపబడును

| | | |
|---|---|---|
| సం॥చందారూ ౬-౦-౦<br>అర్థ ,, ,, ౩-౦-౦<br>విడి ప్రతిక ౦-౧-౦ | GOLKONDA PATRIKA<br>HYDERABAD, Dn.) MONDAY 11-6-1934<br>103462 | ప్రాతపత్రికకు<br>వెల ప్రత్యేకము |

సంపుటము ౯ } శా.శ.౧౮౫౬ శ్రీ భావనామసం॥ నిజవైశాఖ బ॥ ౧౪ సోమవారము ౬-౯-౪౩ఫ. { సంచిక ౧౦

## జిల్లా వార్తలు

# సింగరేణి బొగ్గుగనుల సమ్మెకారణము

### పనివాండ్రు కోరినవిషయములు

హైదరాబాదు; జూను ౨.—

సింగరేణి బొగ్గుగనులలో ౭౦౦౦ మందిపనివాండ్రు మే ౨౪ వ తేది పనిచాలించుటవలన కలిగిన చిక్కులనుగూర్చి అనేకవిధముల వార్తలు పత్రికలలోపడినవి.

ఈబొగ్గుగనుల యజమానులు ఒక ఇంగ్లీషుకంపెనీయని ఈసందర్భమున చెప్పవచ్చును. వీరు నిజాముప్రభుత్వముయొక్క అనుమతిపొంది సింగరేణిలో పనిచేయుచున్నారు. దీని మేనేజింగు ఏజంట్లు మదరాసులో నివసించుచున్నారు. సమ్మెదారులకొరకై బొగ్గుగనుల అధికారులతో సమ్మెవిషయమై సంప్రదించిన హైదరాబాదు కార్మిక నాయకుడగు యస్. వి. నాయకుగారిని అడుగగా ఈక్రింది వాస్తవములను చెప్పినారు:—

పనివాండ్రకష్టములివి. [౧] వారికి ముసలితనములో పెన్షనుగాని ప్రావిడెంటు ఫండుగానిలేదు: [౨] పనిచేయువలసినరోజుల సంఖ్య ౭౨ నుండి ౧౫ కి తగ్గించబడినది [౩] ఇదివరకు పనివాండ్రు రోజుకుమూడు పర్యాయములు మారుట్లు ఏర్పాటు. ఉండెనుకానియిప్పుడు రెండుపర్యాయములే మారుచున్నారు. [౪] జీతములు, విశేషించి బొగ్గుకొట్టువారికి నాటికి ౫౦ వంతునతగ్గింపబడినవి

పనివాండ్రు ఈక్రింది షరతులను కోరుచున్నారు —

౧. పూర్వపు కూలిరేటులను ఉద్ధరించవలెను ౨ కంపెనీవారు ప్రావిడెంటు ఫండుకు సహాయముచేయవలెను. (౩) ప్రతిసంవత్సరము ఒకనెల జీతమునంతో అంతవరకు యీయవలెను (౪) ఏదైనను అకస్మిక యుపద్రవమువలన గాయము పొందిన పనివాండ్రకు నష్టపరిహారము నియమవలెను, ఆదెబ్బప్రాణాంతకమైనచో ఆపనివాండ్రపై జీవనమునకు అధారపడియుండువారికి పెన్షనియ్యవలెయును (౫) ముందు ఒకనెలనోటీసునియ్యక ఏపనివానినిగాని పనినుండి తొలగింపరాదు. (౬) పనిలో ఎవరినిగాని చేర్చుకొనునప్పుడు మొదటినుండి ఉన్న పనివాండ్ర కొడుకులయెడ అభిమానము చూపవలెను (౭)ఇదివరకువలెనే రోజుకుమూడుసార్లు పనివాండ్రు మారుచుండవలెనుగాని రెండుసార్లుకాదు:

సింగరేణి బొగ్గుగనుల జనరల్ మేనేజరు మే ౨౫ నాడు ఈక్రింది నోటీసును ప్రకటించెను:—

[౧] సమ్మెకట్టినవారు ఏషరతులను కోరకయేపనిలో చేరవలయును (౨) వారు వారు చేసినపనికి విచారము తెలుపవలెను (౩) వారుతాము మరియొకసారి ఆ విధమైన కష్టములను కలుగజేయమని మాటనియవలెను.

జీతముల తగ్గింపువిషయమై విమర్శ ఎంతమాత్రము పనికిరాదనికూడ కంపెనీవారనిరి. పనివారు కోరినవాటిలో నెల్ల యీజీతములను తగ్గించగూడదను మాటయేముఖ్యమైనది. కంపెనీవారు మరియొక బెదరింపుగూడ చేసినారు. పనివాండ్రు మే ౨ వ తేదినాటికి పనిలో చేరనిచో తమకు తగునట్లొచ్చిన మరియేవిధమునగాని, పని ప్రారంభించుటకు కంపెనీవారికి హక్కుండగలదని వారు ప్రకటించినారు.

సమ్మెకట్టినవారు యీబెదరింపుకు లొంగక తమషరతులు పరిపూర్తి జేయబడునను మాటయిచ్చినచేగాని తాము మరలపనికి పూనుకొనజాలమని జవాబిచ్చిరి. అంతపై అందోళనమై కంపెని మేనేజింగు కార్యాధికారులు ప్రభుత్వసహాయమును కోరిరి. తర్వాత వరంగల్లుజిల్లా తాలూక్దారుగారును, ౪౦౦ రిజర్వుపోలీసులతో జిల్లామొహతెమీంగారును, జిల్లాపోలీసుల అధ్యక్షుడగు అర్. సి. అయ్యంగారును, ఖమ్మంపోలీసుల అధ్యక్షుడగు ఇ.డబ్లు. టెన్నర్ గారుమొదలైన వారు సింగరేణికి పోయిరి. వారందరును సింగరేణిలోనే యున్నారు.

నిజాంసంస్థానపు రైల్వే పనివాండ్ర యూనియనుకు ప్రధానోపాధ్యక్షుడగు టి. రామకృష్ణారావుగారు పనివాండ్రు పిలిపించగా అక్కడికి పోయియున్నారు. పనివాండ్రుకోరుటచే యస్. వి. నాయుడుగారు బొగ్గుగనుల మేనేజరుతోను, కంపెనీవారి మేనేజింగు ఏజంట్లతోను రాయబారములు ప్రారంభించెను. వారికి యింకను జవాబురాలేదు సమ్మె ఇంతవరకును శాంతముగానే యున్నది. న్యాయముగా తీర్పదగిన తమకష్టములు తీర్చబడునవరకు సమ్మెకట్టినవారు లొంగకూడదని పట్టుపట్టియున్నారు.

యునైటెడ్ప్రెస్.

### త్రివిక్రమరావుగారు తెలిపినవివరములు

బెజవాడ;౫.—

సింగరేణి బొగ్గుగనుల కూలీలసమ్మెను గురించి పట్టుమునుండి రాజీచేయుటకు వెళ్ళిననైజాం రైల్వేయూనియన్ కార్యదర్శిగారగు బారిష్టరుగారు త్రివిక్రమరావు పంతులుగారిని దర్శించి సమ్మెవిషయమును అడుగగా యీక్రిందివిధముగా చెప్పియున్నారు.

సింగరేణి బొగ్గుగనులలో మొత్తం ౭ వేలమంది కూలీలుకలరనియు యిందు ౧౫౦ మంది హెడ్డుకోల్ కట్టర్సు గలరనియు, వీరుకంపెనీనుంచి గజము బొగ్గు తీయుటకు రు. ౪-౦-౦ చొప్పున కంట్రాక్టుచేసి కూలీలనుపెట్టి పనిచేయించెదరనియు, దానిలో యిప్పటిఆర్థికపరిస్థితులవల్ల గజమునకు మూడు రు ౦-౮-౦ తగ్గించిరనియు యీతగ్గింపురోకమునపు యీ హెడ్ కోల్ కటర్సుకు నెలకురు-౨౫౦-౦-౦ నుండిరు ౪౦౦-౦-౦ రూపాయలవరకు అదాయమ్ము చుండెడిది. యీతగ్గింపువలన ఒక్కొక్కరికి రు ౭౦-౦-౦ లు తగ్గుననియు, కంపెనీవారు ౧౯౨౧ సంవత్సరమునుండి యింతవరకు యీజీతమును తగ్గింపుయొప్పకుం చేసియుండలేదనియు, కూలీలను కంపెనీవారు నెలకు ఒకలక్ష యిరువదియయిదువేల రూపాయీలు జీతమిచ్చెదరనియు యీతగ్గింపువలన నెలకురెండు లేక మూడువేల రూపాయిలు తగ్గుననియు అందువలన యీసమ్మెదల యేర్పడినదనియు వారుచెప్పిరి యీసమ్మె వచ్చినతరువాత వీరిలో కొంతమంది బెజవాడకువచ్చి టి, టి రావుగారిని కోరగావీరువెళ్ళి వరంగల్ కలెక్టరుగారితోను నతియునస్పెక్టరుగారితోను జనరల్ మేనేజరుగారితోను మాట్లాడి వారినందరిని సమాధానపర్చి పనివారలతరఫునుంచి ఒకరినిన్ని హెడ్ కోల్ కటర్సుతరఫున ఒకరినిన్ని ఆసమావేశమునకు హాజరుపర్చివారియొక్క-కష్టములు చెప్పుకొనుటకు యేర్పరచగా జనరల్ మేనేజరుగారు వీరందరు ఏషరతులుగాని కోరకయేవచ్చి పనిలో ప్రవేశించవలసినదనియు యిందు సమ్మెకట్టు యేర్పరచిన వారినికూడా క్షమించివారిని యేమీ దండించననియు, తరువాత వీరుచెప్పే కష్టములు విచెదననియు చెప్పిరట దానికి అందరుఒప్పుకొని వెళ్లిరి. తిరిగి అయిదు గంటలలోగి హెడ్ కోల్ కటర్సు ప్రతినిధివచ్చి యిప్పుడు జరిగినరాజీకి యెవరునొప్పుకొనలేదు గనుక ఆరాజీరద్దుపర్చ వలసినదని కోరినాదాని మీద వరంగల్ జిల్లాకలెక్టరుగారు అయిదుగురు మనుష్యులకన్న యెక్కువమంది యొచ్చట జేరరాదని ౧౪౪ సెక్షను క్రింద ఉత్తర్వు యిచ్చిరనియు అప్పుడేకంపెని జనరలు మేనేజరుగారు ౨౬-౫-౩౪ తేదీలోపల అందరు కూలీలుపనిలోనికి రావలసినదనియు అట్లు ఆతేదీలోపల రానియెడల మేము యితరత్రా ఏర్పాట్లు చేసుకొందుమనియు ప్రకటించిరట దానిమీద ౨౯-౫-౩౪ వరకు యెవరుచేరలేదు, ౩౦-౫-౩౪ తేదీనుంచి అందరు పనిలోనికి రామొదలిడిరట ౧-౬-౩౪ తేదీనుంచి పని యథాప్రకారం జరుగుచున్నదని సింగరేణి కాలరీసుజనరల్ మేనేజరుగారు నిన్నటిరోజున వృత్తాంతము వ్రాసిరనికూడా చెప్పిరి. యీసమ్మెకుకారణ భూతులగువారు యీసమ్మె విషయమై సికింద్రాబాదు వెళ్లిరనియు అంతవరకు తిరిగి కాలరీసుకు రావట్లు తెలియుచున్నదనియు చెప్పిరి. ఆరాజీరద్దు పడినందున యిప్పుడు జనరల్ మేనేజరుగారు కొంతమంది పనివారిని పనిలోనుండి తొలగించుటకు ఆలోచించుచున్నారట. యేది యెటులున్నను యింతమంది కూలీలను మేనేజిచేయు జనరల్ మేనేజరుగారు మొదటయిచ్చిన అభయహస్తముప్రకారం యేపని వారినిన్ని తగ్గించకుండా యుంచిన యెడల ప్రపంచమువారియొక్క వుదారతను కొనియాడక మానరు

## గొప్పపద్ధతి పెండ్లి

(స్వ. వి.)

మిర్యాలగూడెం ౩ అమర్దాదు ౧౩౪౩,

ఈరు ౨౧ వ ౧౩౪౩ ఫసలికి సరియగు భావ సంవత్సర వైశాఖబహుళ ౮ లు మిర్యాలగూడెం తాలూకాలో కొత్తపల్లియను గ్రామంలో వురుకూరు మట్టారెడ్డిగారి ద్వితీయకుమారుడయిన చి॥ వెంకటరెడ్డికి అ॥ మహాలక్ష్మమ్మను యిచ్చి వివాహము సమాజపక్షమున జరిగెను. ఇట్టి శుభకార్యములందు పవిత్రతకు భంగమొనరించు భోగం మేళమునకును, విరహోద్రేకపూరితములగు పాటల బూతుపాటలకును, వివిధసంభావాది ఆడంబరోత్సవములకును మిక్కుటముగు రొక్కము వెలవుచేయుచు ఋణగ్రస్తులైనవారు గలరు, గాని భాషాపోషణతో జాతీయకళారక్షణ మొనర్చి, ఆర్యధర్మము నుద్ధరించువారరుదు. పాకంవర్ని రెడ్డి అల్లుల జంగిరెడ్డి గండెసుబ్బయ్యగుప్తగారల యాజమాన్యమున సభ చేయించబడెను. వేదధర్మములు వెల్లడించి ఆర్యధర్మరీతి వివాహములు జర్పనందుకు సంతసించవలసియున్నది. ఇట్లే ప్రతిగ్రామమున శ్రీమంతులు దేశాభిమానులు దేశభాషలనుద్ధరించి భరతమాతను పోషింతురని సభాసమల ప్రార్థించుచున్నాము అని ఉపన్యాసములు చెప్పిరి.

## సింగరేణి బొగ్గుగనులనమ్మె పూర్తిగా అంతరించుట

(స్వకీయవిలేఖరి)

ఇక్కడ చట్టప్రయోగము చేయుటకు తగినకారణములే కనబడుటలేదు, ముందు విప్లవము జరుగునేమోయను భయముతో ప్రభుత్వమువారు ఆచరణలోకి గొనితెచ్చినట్లు తెలియుచున్నది. గనులలోకి పోవువారికి తగిన రక్షణయీయబడుటచే సమ్మెపూర్తిగా అంతరించినది పని వాండ్రందరు యథాప్రకారము పనులలోకి పోవుచున్నారు

## రైల్వేయుద్యోగి వాగనుక్రిందపడి మరణించుట

సింగరేణికాలియర్సు, ౨౬-౬-౩౪ —

(స్వకీయవిలేఖరి)

ది ౬-౬-౩౪ బుధవారమురోజున వుదయం గం॥ ౭ లకు స్టేషనుకు బొగ్గుగని సమీపమునగల (పెద్దబిడ్డి) బొగ్గు తూకము వేయు స్థలమువద్ద రైల్వేయుద్యోగి పాల్ (కాప్స్) అను సుమారు ౩౫ వత్సరముల ప్రాయముగల క్రైస్తవ యువకుడు బొగ్గువాగనుకు రెండవప్రక్క చీటీఅంటించుటకు గాను రయిలుపట్టాలను దాటుచుండగా చేతులతో త్రోయబడినవాగనులు అకస్మాత్తుగా కొట్టుకొనినందువలన రెండువా గనులమధ్య యిరుకుకొని మరణించెను. నేడుదయము విచా రణచేయుటకుగాను రైల్వేఅధికారులు యేతెంచినట్లు తెలియు చున్నది. మృతదుని కొరాబాదునుండి రిలీవరుగా వారమురోజు ల క్రిందటనే యిచ్చటికివచ్చి దుర్మరణపాలయ్యెనని వ్రాయు టకెంతయు విచారముగానున్నది

## స్థానిక వార్తలు

### ఖుర్దాదు ౧౩౪౩లో మలేరియా

నగరమందలి వివిధ ఆసుపత్రులలోను, డిస్పెన్సరీలలో ను మొత్తము ౧౫౪౨౫ మందికి మలేరియాకై చికిత్స చేయబ డియుండెను. గత ౬ సంవత్సరములలో ఇంతకంటెతక్కు వసంఖ్య రాలేదు. మలేరియా అధికారులకునగరమందు ౩౬౪౫ యిండ్లలోనికి అనుమతి దొరకకపోవుట విచారకరము. ౬౭ బావులు పూడ్వబడెను. చార్మహాలులో క్రొత్తగా సిటీస్టాం డు పోస్టుఒకటి ఏర్పాటుచేయబడెను. కుత్బాలలం, చటక్కి పుర, ఫతేదర్వాజా, అందరూనుబల్దా—ఈసలములలో క్రొ త్తగా స్టాండుపోస్టులను ఏర్పరచుటకు నిర్ణయము చేయ బడెను.

బావులు, తొట్లు, మడుగులు, మురుగుకాల్వలు అనేక పర్యాయములు ప్యారిసు గ్రీసుతో శుద్ధిచేయబడెను

అనోఫెలి లార్వే మాసివదిలో కొద్దిగాతప్ప మరెచ్చ టను లేకుండెనని చెప్పవచ్చును.

## నిజాం సంస్థానమునకు ౪ ఫైరు బ్రిగేడులు

### అగ్ని ప్రమాదములలో బాధపడిన వారినిగూర్చి విచారణ

ఈమధ్య మన రాష్ట్రములో జిల్లాలలో అక్కడక్కడ నాలుగైదు అగ్నిప్రమాదములు గొప్పవి జరిగియుండెను వరం గల్లులోనే ఒక గొప్పది జరిగియుండెను. ఆసందర్భములలో నెల్ల మంటలను, నిప్పును త్వరలో చల్లార్చుటకు సాధనములే నందువలన ఉపద్రవము ఎక్కువగా నుండినట్లు స్పష్టమైయు న్నది. అందువలన అధికారులు ఈవిషయమై వెంటనే శ్రద్ధ తీ సికొనుచున్నారు. ప్రస్తుతము సంస్థానములో పెద్ద జిల్లాలగు వరంగల్లు, గుల్బర్గా, ఔరంగాబాదు, మెదకుజిల్లాలకు వాల్లిం టికి ప్రధాన పట్టణములలో సుమారు రూ ౩౦౦౦౦౦ లు ఖర్చుచేసి ఫైరుబ్రిగేడు స్టేషనులను ఏర్పాటు చేయదలచియు న్నారు. [illegible] ముఖ్యపట్టణములోగూడ యిట్టి యేర్పాటులు చేయుదురట.

ము. ఖు. క. ప్రభుత్వగారు పరశురామప్రభీక [illegible] తీర్థములవద్దలో ఎంతనష్టము కలిగెను. ఎంతసహాయము ఆ వసరము అనుదానిని నిటివిషయములను కనుగొనుటకు ఆయా చోట్ల అధికారులకు ఆజ్ఞల నిచ్చియున్నారు. బాధపడుచున్న వారికి తగినంత సహాయము చేయుటకై దయామయులగు ప్ర భువుగారు ఆతృతతో నున్నారు

### బాలికా పాఠశాలలకు దానములు

శ్రీయుత గోట్యాల వెంకయ్యగారు (గౌలిగూడెము) తన కుమారితయగు చి॥ పద్మవతీదేవి వివాహ సందర్భమున బాలికల ఉన్నతపాఠశాల. (సుల్తానుబజారు,) సహాయార్థము యిరవై అయిదు రూపాయలు విరాళము దయచేసిరి వీరి వి ద్యాభిమానము ప్రశంసనీయమును యితరులకు మార్గదర్శకము నై యున్నది ఈ విరాళము వందనములతో నందుకొనుచు న్నాము.

ఈ పద్మవతీదేవి బాలికల ఉన్నత పాఠశాలలోని వి ద్యార్థిని

* * వ

కీ శే సంఘము సీతారామయ్య (ఇసామియాబజారు) గారి కుమార్తె శ్రీమతి వెంకట రమణమ్మగారు తమసోదరియ గు శ్రీమతి విమలాదేవి వివాహసందర్భమున, బాలికల ఉన్న తపాఠశాల (సుల్తానుబజారు) సహాయముకొరకు పదిరూపా యలు పంపిరి. నిజామురాష్ట్ర యాదవ సంఘోద్ధారకులగు సీ తారామయ్యగారి పుత్రికలగు పైయువ్వురు యువతులును ఈ విద్యాలయమునందు చదువు పూర్తి చేసికొనిరి శ్రీమతి వెంకట రమణమ్మగారి అభిమానము ఇతర స్త్రీలకును పురుషులకును మార్గదర్శకము కాదగియున్నది.

మా హనుమంతరావు

కార్యదర్శి

### రెడ్డిబాలికల వసతిగృహము

సుల్తానుబజారు హైదరాబాదు

వేసవికాలపు సెలవులు ముగిసినందున రెడ్డిబాలికల వ సతిగృహము తా ౧౫ జూన్ ౧౯౩౪ (౧౩౪౩అమర్దాదు౧౩౪౩ఫ) శుక్రవారము నాటినుండి తెరవబడినది విద్యార్థినుల తల్లిదం డ్రులుగాని సంరక్షకులుగాని క్రొత్తగ ప్రవేశ పెట్టనుద్దేశించువారిని వెంటనే పంపవచ్చును. ఇతర వివర ములు కార్యదర్శివల్ల తెలిసికొనవచ్చును

రామలింగారెడ్డి

కార్యదర్శి

అర్థిక శాఖామంత్రులగు నవాబు సర్ అక్బరుహైదరు నవాబుజంగు బహద్దరు, హోంసెక్రటరీ అగు నవాబు జు లదరుజంగు బహద్దరు, మౌల్వీ సయ్యదు అలీరజాసా॥ నవా బు జైనుయారుజంగు బహద్దరు, మౌల్వీ హామీదుఅహమదు అన్సారిసా॥ గారలతోసహా విన్నయుదయము ఇంజనియరు కాలేజి విద్యుచ్ఛాఖను చూచిరి

### అబ్కారి శాఖలో క్రొత్తఉద్యోగ స్థానాలు

అబ్కారి శాఖకొరకు నూతనస్కీము అంగీకరింపబడిన ట్లు తెలియుచున్నది ఇది ౧౩౪౪ ఫ అజూరు నెలనుండి అమలులో పెట్టబడునట ఈ స్కీమునందు ప్రస్తుతము అ బ్కారి మొహతమీంలకు కార్యభారము హెచ్చుగానుండు టవలన వారికి సహాయులుగా నుండుటకు ఒక మదద్గారు మొ హతమీం, ఒక శిరస్తేదారు, అను రెండు నూతనపదవులు నెలకొల్పబడెను శిరస్తేదారు వేతనము రు ౨౦౦ లనుండి రు ౧౫౦ ల వరకు యుండును. ఇప్పటివరకు అబ్కారి మొ హతమీం కార్యాలయమునందు మదద్గారేగాని, శిరస్తేదారే కాని లేకుండిరి కొన్ని జిల్లాలందు మొహతమీములుఅబ్కారి ఇనస్పెక్టరులనుండి సహాయము గైకొనుచుండిరి

## జాగీరులలో సహకారోద్యమము

జాగీరులలో సహకార సంఘములు స్థాపించువిషయ మున జాగీరుదార్ల సంఘము నిజాము ప్రభుత్వమువారినుండి అంగీకారము పొందియున్నారు కనుక ఈసంఘముయొక్క కార్యదర్శి ప్రజాక్షేమమునకు లాభప్రదమగు సహకార సంఘ ములను జాగీరు గ్రామములలో స్థాపించువిషయమున జాగీరుదా ర్లను ప్రార్థించుచు ప్రకటన చేసియున్నారు

### గంజాయి వ్యాపారము

ఈ వ్యాపారమును కానూనుకు విరుద్ధముగా జరుపుచు న్న తారాచంద్, అయోధ్యాప్రసాదు అనువారలు పట్టుకొనబ డినారు వీరు ఘాంసిబాజారు నివాసులు గంజాయి మొద లగు మాదకద్రవ్యములను వీరు స్వాధీనములో నుంచుకొని ర హస్యముగా విక్రయించుచుండిరట

### పహిల్వాను పెండ్లికొడుకును కొట్టుట

శాలారాము అనుఒక పహిల్వాను ముగ్గురు పరిజనుల తో ఒకపెండ్లి మహోత్సవమునకు పోయి పెండ్లికొడుకును బ హుమానము యియ్యమని యడిగెను పెండ్లికొడుకు తండ్రి ఒకరూపాయ యిచ్చెను అందుపైన కోపపడి పహిల్వాను అతని వెంటనున్న వారు కలిసి పెండ్లికుమారుని అతనితండ్రిని కొట్టిరి. ఈవిధముగ ఫిర్యాది సికింద్రాబాదులోని రెండవ మా జిస్ట్రేటువద్ద దాఖలు అయినది నిందితులు పట్టుబడి నిర్బంధ ములో నున్నారు

## నిజాంరాష్ట్రమున ఆముదాలు వగైరా

౧౩౪౩-౪౩ వ ఫ॥ రెండవ లేక కడపటి నివేదిక
౧౯౩౩-౩౪

(౧౯౩౦-౩౧ తో అంతమగు అయిదేండ్లలో ఈరాష్ట్ర మున ఆముదాలపంటక్రిందనుండు భూవిస్తీర్ణము మొత్తము ఇండియాలో ఆపంటక్రిందనుండుభూవిస్తీర్ణములో ౧౦౦౦ ఎకరములలో ౪౭౬ ఎకరముల లెక్కనవుండెను)

ఈకడపటి నివేదికలో ఎంతవిస్తీర్ణపుభూమిలో ఆము దాలపంట, వివిధపంటలు వేయబడినదియు తెలుపబడినది. అంతేగాక ఎంతఫలితము తేలియున్నదియులేక తేలవచ్చునని అశయుండునది యు తెల్పబడినది నివేదిక కాలమును పూ ర్వసంవత్సరమున దీనికిసరిపోవు కాలముతో పోల్చి ఈక్రింది పట్టికయందు వివరములు తెలుపబడుచున్నవి —

| పైరు | ఎకరములు ఇపుడు | ఎకరములు పూర్వము | టన్నులలోపంట ఇపుడు | టన్నులలోపంట పూర్వము |
|---|---|---|---|---|
| ఆముదములు | 824882 | 837882 | 66613 | 60796 |
| వివిధపైరు | 498853 | 554630 | 14726 | 15315 |
| మొత్తము | 1323735 | 1392512 | 81339 | 76111 |

దీనివలన ఈపంటలక్రిందనుండు భూవిస్తీర్ణములో గ తసంవత్సరపు కడపటి నివేదికపై ౧౦ వేల ఎకరములకు 496 ఎకరములవంతున తగ్గినట్లు తెలియగలదు అయినను పంట హెచ్చుట విశేషము,10 వేలటన్నులకు 687 టన్నులవంతున ఫలితము హెచ్చినది దీనికి యీతుపరిస్థితులు ఈపంటలకు అనుకూలముగా నుండుటయే కారణము. ఖరీఫుకోతలు ముగిసినవి రబ్బీపైరు కొన్నిచోట్ల కోతలోనున్నది. నల్గొం డలో కొన్నిచోట్ల పైరు చీడపట్టినది

## నిజాం రాష్ట్రమున ప్రత్తిపంట

౧౩౪౩-౪౫ ఫ ౫ వ నివేదిక
౧౯౩౩-౩౪

౧౯౩౧-౩౨ తో అంతమగు అయిదేండ్ల మొత్తముపై నిజాంరాష్ట్రమందు ప్రత్తిపంట క్రిందనుండిన భూమిమొత్తము యిండియాలో ప్రత్తిపంట క్రిందనుండిన భూమిలో ౧౦వేల ఎకరములకు ౧౪౬౦ ఎకరముల లెక్కన ఉన్నది.]

ఇది ౫వ లేక కడపటినివేదిక ఇందులో ఖరీఫు రబ్బీ ప్రత్తిపైరు వేయబడిన భూమియొక్క విస్తీర్ణము తెలుపబడి యున్నది

ఈ పైరు వేయబడిన భూమి యొక్క విస్తీర్ణము ౩౬౯౫౬౭౬ ఎకరములు ఉండునని అంచనా వేయబడుచు న్నది గతసంవత్సరము ౫వ నివేదికలో ఇది ౩౬౦౧౬౫౫ ఎకరములుగా నుండెను ప్రస్తుతపుపంట ౫౬౩౯౪౧ బేళ్లు. పూర్వనివేదికలో ౫౩౩౪౯౧ బేళ్లుండెను ఇపుడు హెచ్చు టకు అనుకూలమైన ఋతుపరిస్థితులే కారణము

### భిక్షావృత్తి నిషేధాజ్ఞ

గత కంటోన్మెంటు బోర్డువారి సభలో తీర్మానింపబ డిన ప్రకారము, సికింద్రాబాదు పట్టణములో రోడ్లపైన భిక్ష మెత్తుకొనుట అక్రమముగా నిర్ణయించబడినది ౧౫ జూలై నుండి ఈ తీర్మానము ప్రకారము అమలుజరుగును (ఇట్టి శాసనమొకటి చేయుటకై ౫-౬ సంవత్సరముల క్రిందట మా నశాసనసభలో నొక చిత్తుశాసనమును శ్రీ రాయ విశ్వేశ్వర నాథు బి. ఏ. ఎల్ ఎల్. బి గారు ప్రవేశ పెట్టియుండిరి. దానిగతి యేమైనదో తెలియలేదు)

(౭ వ పేజీ చూడుడు.)

గోలకొండ పత్రిక
... సం॥ నిజ వైశాఖ బ॥ ౧౪
సోమవారము

## అమరచింత సంస్థానము

కొలది దినములక్రిందటనే అమరచింత(ఆత్మకూరు)సంస్థానము కోర్టుఆఫ్ వార్డ్సు నిగరానీ నుండి విడుదలగావింపబడి శ్రీరాణిగారి వశముగావింపబడినదనువార్తను విని సంతోషింపని యాంధ్రుడుండడు. శ్రీమంతు రాజా శ్రీరామభూపాలరావు బహద్దరుగారు సుమారు ౩౦ సంవత్సరముల వయస్సున చనిపోయిరి వారుచనిపోయి సుమారు ౪ సంవత్సరములయ్యెను. వారి పట్టమహిషియగు శ్రీమంతురాణీభాగ్యలక్ష్మీదేవమ్మగారు విద్యావతులు, శాంతస్వభావలు, అనుభవజ్ఞులు, ప్రజలయందు దయగలవారు. వారి దురదృష్టములవలన వారికి నలుగురైదుగురు సంతానముకలిగియు నష్టమయ్యెను. వారింతలో నొక బాలుని దత్తు తీసుకొనుచున్నారనియు వినుచున్నాము

ఈసంస్థానము ఆంధ్రసంస్థానములలో చాల ప్రాచీనమైనది. ఇది మహబూబునగరము జిల్లాలో చేరినది. సుమారు ౭౦ గ్రామములుకలదు. దీని వైశాల్యము ౧౯౦ చదరపు మైళ్లు. దీనియాదాయము ౧౪లక్షయని, గజెటియర్ ఆఫ్ ఇండియా,లో వ్రాసినారు. కాని అది యేనాటి మాటయో అయియున్నది. ప్రకృతము దీని యాదాయము చాలవృద్ధియైనది. సుమారు ౭-౮ లక్షల యాదాయమున్నది. సరియైనమార్గములో నీసంస్థానమును వృద్ధిచేసిన,౧౦-౧౨లక్షల ఆదాయముకలిగించుటలో నేమియు సందేహముండదు. ఈ సంస్థానములో ఉక్కుసెట్టినాగా ఆను నొకమూసీయంతటి చిన్నజీవనది ప్రవహించుచున్నది. అదిఎండకాలమందును సదా పారుచుండును ఇట్టినదికి ఆనకట్టలువేసి కాలువలుతయారుచేయించిన అనేక వేల ఎకరముల భూమి తరీశేస్తుకు యోగ్యమగును. మరియు భూములు అనేకగ్రామములలో చాల సారవంతమైనవిగలవు. ప్రకృతము రైలుమార్గము కూడ నీసంస్థానము సమీపములోనే పోవుచుండుటచేత స్టేషనుల సమీపప్రదేశములందు వ్యాపార సౌకర్యములుకలిగించి, మదనాపురము(వనపర్తి రోడ్డుస్టేషను)ను తలదన్ను వ్యాపారస్థలములగుటలో నేమియు సందేహములేదని గట్టిగా చెప్పగలము. మరియు అబ్కారీ యభివృద్ధి యపారముగా చేయు ననుకూలములుకలవు ఇట్లు నానామార్గములలో నీసంస్థానము వృద్ధికాగల సూచనలు కలవు ప్రకృతియు నట్టి యనుకూలములు కలిగించినది. శ్రీరాణిగారి పరిపాలనలో పై సూచించినవిధములందును మరియు నితరవిధములందును ... సర్వ ... వృద్ధియు దానితో పాటిగా ... వృద్ధియు కలుగునని నమ్ముచున్నాము.

... స్థానము ... ముసల్మానువారికి ... వేల రూపాయీలు ... చెల్లించుచున్నది.

ఈ సంస్థాన రాజధాని ఆత్మకూరు. ఇందలి సంఖ్య సుమారు ౩౫౦౦ ఈ సంస్థానము పూర్వమునుండియు హస్త పరిశ్రమలకు ప్రసిద్ధినొందినట్టిది. ఇప్పటికని మంచి నూలు వివ వస్త్రము ౧౪ ఈ సంస్థానమువి పేరుపొందినట్టివి సంస్థానమువారు తమదేవిడీకిని తమ యవసర కార్యములకన్నింటికిని తమసంస్థానపు వస్త్రములను కొని ఆశ్రితుల చేతను నట్లే చేయుటకు ప్రోత్సహించిన యీ కృషి మరలపూర్వమువలెనే వృద్ధిపొంది ఎగుమతులు కూడ చేయగలుగును

మొత్తముపై సంస్థానము విడుదలయైనందులకు మేము శ్రీరాణీగారి నభినందించుచు వారి కాయురారోగ్యముల కోరుచు వారి పరిపాలనము కీర్తివంతమై యుండుగాక యని యాశించుచున్నాము



కీ. శే. రాజా శ్రీరామభూపాల బహద్దరుగారు
(అమరచింత)

## సింగరేణి సమ్మె

సింగరేణి బొగ్గుగనులలో సమ్మెఅంతరించినట్లు వార్తలువచ్చినవి. వరంగల్లుజిల్లా తాలూక్దారుగారి ౧౪౪ వ సెక్షను ప్రయోగము గెల్చినదని చెప్పవచ్చును. పనివాండ్రు పనులలో చేరుచున్నారు. అయితే యిది సంపూర్ణముగా సంతోషింపదగిన విషయముకాదు. ఎందువల్లననగా, సమ్మెకట్టినవారు బెదరుచేతను, నిరాశచేతను సమ్మెమానినట్లు స్పష్టముగా నున్నదే కాని వారుతమకుగలవనుచున్న కష్టములుతీరుట చేతగాదు. కాబట్టి తాత్కాలికముగా శాంతి యేర్పడినను పనివాండ్రమనస్సులకు సంతృప్తి కలుగలేదు, వారికెప్పుడు సమయములో వారికి కష్టములు దుర్భరములనితోచినపుడు, యిప్పటివలెనే చిక్కు తిరిగి సంభవించును. క్రొత్తపనివాండ్రను పర్చరించుకోనవచ్చునుగాని యిపుడుండు పనివాండ్రకు నిజముగా జీవనము కష్టమగుటచేతనే వారు సమ్మెకట్టియుండుచో రేపుక్రొత్తవారు చేరినను యిప్పటిచిక్కు తీరగదా !

అందువల్ల సింగరేణిబొగ్గుగనుల యజమానులు యిప్పుడు శాంతముగా—సమ్మెకూడ ముగిసినది కాబట్టి ఉద్రేకమును తగ్గించుకొని—పనివాండ్రు సంతోషముతో పనిని తృప్తికరముగా చేయుటకు తగినపరిస్థితుల నేర్పరచు విషయమై ఆలోచించుట అవసరము యజమానులకు ప్రస్తుత ఆర్థికదుస్థితివలన కష్టము కల్గియుండలేదని మేముచెప్పము కాని యజమానులు కొంత సద్భావముచూపుచో పనివాండ్ర జీతములను, సెలవురోజులను, విరామకాలమును ఎక్కువగా మార్చక తమలాభమును న్యాయమైనహద్దులో నుంచుకొనుటకు అనుకూలమగు మార్గము లభించకపోదు.

నిజముగా,సాధారణముగా పనివాండ్రస్థితి చాలాహీనమైనది. వారు ఏనాడుసంపాదించుకొనునది ఆనాడే ఖర్చుఅగును. వారు పనిచేయలేనినాడు సకుటుంబముగా పస్తు ఉండవలసినదే కదా! వారిపని యెప్పుడుపోయినను పోవచ్చును. నిజముగా వారు కనికరింపదగినవారు. వారు యితరులద్వారా కోరుచున్న కోర్కెలలో కొద్దిగా అతిశయోక్తులు కనిపించవచ్చును. అయినను యజమానులు వాటిని లక్ష్యముచేయక వాస్తవముగ కనుగొని యథార్థములైన కష్టములను, తినుటకు నష్టములేనంతవరకు, తీర్చుటకు యత్నించుటవలన ఉభయులకు క్షేమము కలుగును. పనివాండ్ర అభివృద్ధి పనియొక్క అభివృద్ధికి తోడ్పడునని అందరును ఒప్పుకొనువిషయమేగదా !

హి. హ. హ. నిజాం ప్రభుత్వమువారు సింగరేణి బొగ్గుగనులకంపెనీ మనరాష్ట్రమున పని చేయుటకు అనుమతినిచ్చినవారు. కంపెనీవారు చిరకాలముగా మనరాష్ట్రమందలి బొగ్గుగనుల వలన లాభము పొందుచున్నపుడు, పనివాండ్ర కష్టములను, ముఖ్యముగా తీర్చదగినవాటినైనను, వారు తీర్చునట్లు చేయుటకు ప్రభుత్వమువారికి అధికారముగలదు. ప్రభుత్వమువారు యజమానులకు తగువిధమున సలహానిచ్చి తమ పలుకుబడిని వినియోగించినచో మరియొకసారి కార్మికుల విషయమున సాధారణముగా ప్రజలకు రుచింపని ౧౯౪౫ వ సెక్షనువంటి ఆజ్ఞలను చేయవలసిన అవసరము తప్పును.

---

౫ వ పేజీ తరువాయి స్థానిక వార్తలు

## రాకపోకలు

### శ్రీదక్కను రాణీగారు

మన శ్రీరాణీగారు ౨ అమర్దాదునాడు రాత్రి బెంగుళూరునుండి రాజధానికి దయచేసిరి కాచీగూడెము స్టేషను పైకి రైలు రాగానే ఫర్లాలు వేయబడినది ౯ గంటలవేళ శ్రీరాణీగారు సెలూను (ప్రత్యేకపు రైలుడబ్బా)నుండి బయటకు వెడలిరి

### నవాబ్ వలియుద్దౌలా బహదరు

మంత్రివర్యులగు ఏ నవాబుగారు సోమవారమునాడు ఉదకమండలమునుండి తిరిగివత్తురని తెలిసినది

### వరంగల్లు సూబేదారు

వీరు నిజామాబాదుజిల్లా జౌరాకు వెళ్ళినారు (నిజామాబాదుజిల్లా మాలు వ్యవహారముల విషయములో వరంగలు సూబాలోను, అదాలతు మున్నగు ఇతర విషయములలో మెదకు సూబాలోను చేరియున్నది. ఈ సంగతి పాఠకులు జ్ఞప్తియందుంచుకొనవలసి యున్నది)

### నవాబ్ నిజామతుజంగు బహద్దరు

వీరు తీర్థయాత్రలు జరిపి ౩ అమర్దాదు తారీఖున నాంపల్లిస్టేషనులో దిగిరి వీరిని ఎదుర్కొనుటకు ఎందరో ఉద్యోగస్థులు స్నేహితులు సిద్ధముగానుండి వీరిని పుష్పహారములతో గౌరవించిరి

### నవాబ్ బహదరు యార్‌జంగు

వీరు ఒక్క సికింద్రాబాదులో జరుగనున్న మీలాదున్నబీ సభలో తప్పతక్కిన ఇట్టిసభలలో, అనారోగ్య కారణమువలనను కార్య బాహుళ్యమువలనను ఉపన్యసింపజాలరని ప్రకటించిరి (మీలాదున్నబీ సభలు మహమ్మదీయమతస్థాపకుడగు పైగంబరుగారి గుణ వర్ణనముకై చేయబడుసభలు. ఇవి ఈరాష్ట్రమున ముఖ్యముగా నగరమునందు చాల వైభవముగ జరుపబడుచుండును)

### మిస్టరు టాస్కరుగారు

వీరిప్పుడు ఉదకమండలము (ఊటీ)లో నున్నారు అచ్చట జరిగిన ప్రభుత్వపు విందునకు ౪ జూనునాడు వీరును వెళ్ళియుండిరి

---

### మక్కా మదీనాలలో వస్త్రనిర్మాణము

### నగరములో ప్రోత్సాహక సభ

ఆరేబియా దేశములోని పవిత్ర నగరములందు వస్త్రముల నేతనుగురించిన హైదరాబాదు సంఘమువారి సమావేశము ౩ అమర్దాదునాడు జరిగినది దీనిలో ఈక్రింది సభాసదులు వచ్చియుండిరి.

౧ నవాబ్ సైఫ్ నవాజ్ జంగ్ బహదురు.
౨ ఆల్హాజ్ మౌలానా మహమ్మదు సాదుషా హాహుసేని, దక్కను మహమ్మదీయ విద్యాసంఘ కార్యదర్శి
౩ ఆల్హాజ్ నవాబ్ ఫఖరుయార్ జంగ్ బహదురు
౪ ఆల్హాజ్ డాక్టరు ఖాజా మొయినుద్దీన్ సా॥
౫ ఆల్హాజ్ సయ్యద్ షాహ వలీయుల్లా హుసేని సా॥
౬ ఆల్హాజ్ షాహ సైఫీ, ఆహామదు షత్తారీ వగైరాలు

పై సభాసదులలో (౪) గురు మదీనాలో సిద్ధమగుచున్న వస్త్రమును సభా సదులయొగుట చూపి రిపోర్టు చదివిరి. [illegible] గురించి మహమ్మదీయమతము [illegible] పెద్దల అభిప్రాయములు [illegible] భిన్నాభిప్రాయములు వెలవీకరించిరి. ఈ యభిప్రాయములన్నియు సమన్వయము కావలెనని ప్రబోధించిరి.

ఏకగ్రీవముగా అయిన తీర్మానమేమనగా—ప్రస్తుతము బట్టలునేయుపనినే జారీచేయవలయును అక్కడస్థితులు బాగైనతరువాత ఇతర విషయములపైని దృష్టి సారించవచ్చును. డాక్టరు మొయినుద్దీన్‌గారు వస్త్రపరిశ్రమను గురించియున్న మహమ్మదీయ మహాశయుల అభిప్రాయములను చదివి వినిపించిరి తుదకు తీర్మానింపబడిన మరియొక విషయము ఏమనగా —ప్రస్తుతము ఈసంఘముయొక్క పనిని వ్యాపారదృష్టితో చూడగూడదు మదీనా నగరవాసులలో వస్త్రపరిశ్రమపైన అభిమానమును పుట్టించుటయే ముఖ్యోద్దేశము ("ఆల్హాజ్" అను బిరుద నామమునకు అర్థము యాత్రచేసి వచ్చినవారు అని దీనిని మహమ్మదీయ సోదరులు మక్కామదీనా యాత్రచేసి తిరిగి వచ్చినప్పటినుండి తమపేళ్ళ వెంబడ తగిలించుకొనెదరు ఇది ప్రభుత్వమువారిచ్చు బిరుదమని భావింపగూడదు గొ, ప. సం.)

---

### ఖుర్దాదు ౧౩౪౩లో ప్లేగు.

హైదరాబాదు నగరములో ౧౩౪౩ ఖుర్దాదులో ఇద్దరికి ప్లేగుతగిలెను. ఇరువురు మరణించిరి జిల్లాలనుండి ప్లేగు తగిలినవారు యిద్దరువచ్చి మరణించిరి మిలిటరీ ప్రదేశములలోను సరిహద్దుగ్రామములలోను ప్లేగు అను మాటయేలేదు. మునిసిపాలిటీ ప్రదేశములలో ఎలుకలుపడెను గాని మిలిటరీ ప్రదేశములలోను, సరిహద్దు గ్రామములలోను పడలేదు

౩౩౪౧౦ ఎలుకలను పరీక్షింపగా ౩మాత్రము ప్లేగుగలవని కనపడెను ౩౩౬౫౨ ఎలుకలు బ్రతికినవి పట్టుకొనబడెను ౧౮౩ యిండ్లలో ఫినైలు శుద్ధిచేయబడి పొగకూడ వేయబడెను రాళ్ళ యిండ్లకు పొగమాత్రము వేయబడెను, ౪౪౭౫౦ ఎలుకల బొందలు పూడ్చివేయబడెను ఒక ఆరోగ్యశిబిరము తెరువబడెను అందులో ౧౨మందికి ఏర్పాట్లు చేయబడెను సమాజముల డాక్టర్లు ౭ యక్షిణీ దీపముల ద్వారా ఉపన్యాసములనిచ్చిరి

సరిహద్దు గ్రామములలో ౩౬౦౦ బ్రతికిన ఎలుకలుపట్టుకొనబడెను రెండు యక్షిణీ దీపములద్వారా ఉపన్యాసము లీయబడెను ౧౧ సరిహద్దుగ్రామాలలో మాత్రము స్ఫోటకముండెను

సికింద్రాబాదు, ఔరంగాబాదు, నిజామాబాదు మహబూబునగరు, నల్గొండ వరంగల్లు, ఆదిలాబాదు, పర్భణిజిల్లాలు తప్ప తక్కినవన్నియు ప్లేగుతగిలియుండెను జిల్లాలలో మొత్తము ౯౭౮ మందికి ప్లేగు తగిలెను ౬౩౭ మంది చనిపోయిరి ౭౨౯ మందికి ప్లేగు టీకాలు వేయబడెను

---

## భర్త చాపలో చిఱునవ్వు

పతివ్రతయొక్క సహగమనాలంకారము

క్రొత్తఢిల్లీలో మే ౨౭ తేదీనాడు సవయము ఠాకూరు జగన్నాథ్‌గారు మృతిచెందిరి వారిసతి, యశోదాదేవి చిఱునవ్వుతో సొగసు చేసికొని భర్త శవము ఉంచిన చాపలో [illegible] తానకూడ భర్తతోట చితిప్రవేశము చేసెదనని తన అభిలాషను తెలియచేసెను

పోలీసువారికి తెలియచేయబడగా వారు వచ్చి యశోదాదేవిని యొక గదిలోనుంచి తలుపువేసి శవమును ఆలస్యములేక దహనము చేయించిరి

జనులు ఆందోళితహృదయులై గుంపులు గుంపులుగా ఆయింటియొద్ద చేరి చూచుచుండిరి

---

[illegible]

విలాయాతి కాశ్మీర్ "లోటస్‌హెన్" ని ఉపయోగించి కన్నులకు చల్లదనమును కలిగించును అది కన్నులను చల్లగాను ప్రకాశవంతములుగాను ఉంచును మరియు అది కంటిరెప్పలు, కంటిరెప్పలలో నలుసులు పడినట్లుండుట, సమీపదృష్టి, పొరలుక్రమ్ముట మొదలైన రోగములను ప్రత్యక్షమైన మందు [illegible] మోసపోకుడు. వివరములు ఉచితము

KASHMIR SWADESHI STORES
Santnagar Lahore No)

---

వచ్చినవి వచ్చినవి. — ఏమిటి?
పెండ్లిండ్ల రోజులు! అయితే ఏమి?
బట్టలు కావలదా! ఎక్కడదొరకును?
కారచోయి జరి చీటీ వగైరా అన్ని క్రొత్త రకములు దొరకును
ఎక్కడంటే?

ఆర్. ఆర్. గోపాల్, బట్టలవర్తకుడు
అల్లావుద్దీను బిల్డింగు పత్తరుగట్టి హైదరాబాదు – దక్కను,

---

# ఆంధ్రయిన్సూరెన్సుకంపెనీ, లిమిటెడ్ బందరు

### స్థాపితము ౧౯౨౫

కొలది సంవత్సరములలోనే అద్భుతముగు అభివృద్ధిగాంచిన సంస్థ

| | | |
|---|---|---|
| ౧౯౩౬ లో జరిగిన వ్యాపారము | ... | ౧౯౪౨౦౦ |
| సాలీనా ఆదాయము | ... .. | ౩ లక్షలు |
| భీమానిధి | .. .. | ౭ లక్షలు |

మితవ్యయము నిర్దుష్టపరిపాలన మాకంపెనీయొక్క ముఖ్యలక్షణములు

సాలీనా చెల్లించు ప్రీమియములకై నూటికి రు ౨—౮—౦ మినహాయింపు

రద్దయినపట్టాలు బాకీలుపడిన ప్రీమియములు చెల్లించవలసిన అవసరంలేకుండగా రద్దయిన పట్టాలు తిరిగి అమలులోనికి తెచ్చుట మొదలగు అనేక సౌకర్యములు గలవు

మొదటి వాల్యుయేషనులోనే సాలుకు ౧౦౦౦కి రు ౧౦లు బోనసు పంచబడెను

అన్నిచోట్లను మంచికమిషన్లు కలుగజేయబడును [illegible]

వివరములకు:— య. మంగయ్య [illegible]

## బ్రిటిషు ఇండియా వార్తలు

### బొంబాయి సమ్మె

బొంబాయిమిల్లుల పనివాండ్రసమ్మెను పరిష్కరించుటకై చేయబడుచున్న యత్నములు ఫలించుసూచన అగుపడుటలేదు. మిల్లు యజమానులు మొండిపట్టుతో నున్నారు. భారతవణిక్సంఘము (ఇండియన్ మర్చెంట్సుచేంబరు) తరఫున ఒక ఉపసంఘమువారు మిల్లుయజమానుల సంఘమునకు వ్రాసిన లేఖకు జవాబు ఏమనగా, "ప్రస్తుతము సమ్మె జరుపబడుచున్న తరహా చూచినచో భారత వణిక్సంఘమువారి జోక్యము వ్యర్థమేననితోచును" అని. సమ్మెనాయకులుకూడ తాము సంధిప్రయత్నములను మానుకొనుటయే మేలనితలంచుచున్నారు. ఈలోగా గాంధిగారికిని మిల్లుయజమానుల సంఘములోని మోడీగారికిని ఉత్తర ప్రత్యుత్తరము లేమి జరిగెనో తెలియుటలేదు. మోడీగారు సమ్మె అంతరించుచున్నదని ప్రకటించుటచే బొంబాయి సమ్మె కమిటీవారు సంధిప్రయత్నములలో పాల్గొనక మిల్లుయజమానులు సమ్మెదారుల షరతుల కన్నింటికి ఒప్పుకొనునంతవరకు సమ్మెను జరుపుచుండుటకు తీర్మానించినారు. ఈతీర్మానమునకు ముఖ్యకారణ మేమనగా మిల్లుయజమానులు కొందరు ఒకవైపు సంధి రాయబారములు జరుపుచు యింకొకవైపు సమ్మెను భేదించుటకు యత్నములను చేయుచుండిరట. కాబట్టి భారత వణిక్సంఘమువారి గాని బూలాభాయ్ దేశాయిగారుగాని చేయు సంధిప్రయత్నములలో సమ్మెదారులు పాల్గొనరని సమ్మెకమిటీ కార్యదర్శివారికి తెలియజేసెను. సమ్మెదారుల అండిలేని కుటుంబములకు సహాయముచేయుటకై ఒకకేంద్రము పనిచేయుచున్నది. మిల్లుయజమానులు రోజురోజుకు పనిలో చేరువారి సంఖ్య ఎక్కువగుచున్నదని చెప్పుచున్నారు. ఇప్పటికి ౩౦ మిల్లులు పనిచేయుచున్నవట. సమ్మెచేయువారిలో విభేదములను కల్పించియు, క్రొత్తపనివాండ్రను చేర్చుకొనియు సమ్మెను పడగొట్టుటకై మిల్లుయజమానులు చేయుయత్నములను పడగొట్టుటకై సమ్మె కమిటీవారు పికెటింగును ఏర్పాటు చేయుచున్నారు.

### ఇతర స్థలములకు సమ్మెజ్వరపు వ్యాప్తి

కరాచిలో ఒక రైల్వే కంట్రాక్టరుక్రింద స్టేషనులో సామానులను ఎత్తుటకును దించుటకును పనిచేయు ౨౦౦ మంది పనివాండ్రు జూను ౭ వ తేది ఉదయము పనిమానిరి. వారెక్కువ జీతము కోరిరి. అది ఒసగబడనందువలన వారట్లు చేసిరి.

కలకత్తాలో కోడను ఊడ్పుపనివాండ్రు సమ్మెచేయుటకు ముందు ఒకనెల నోటీసు నిచ్చినట్లు తెలియుచున్నది. కలకత్తా మునిసిపలు కార్పొరేషను ఉద్యోగులు వారిని అనేకవిధముల బాధించుచున్నారట. నిజమును బహిరంగ విచారణమూలముగా కనుగొని తమకష్టముల దీర్చనిచో నెలరోజులు చూచి తర్వాత సమ్మె ప్రారంభించెదమని పనివాండ్రు ప్రధాన కార్యనిర్వాహకోద్యోగికి (మునిసిపల్ చీఫ్ యగ్జిక్యూటివ్ ఆఫీసరుకు) తెలియజేసిరి.

ఢిల్లీలో సమ్మె చురుకుగా జరుగుచున్నది.

### విప్లవాందోళకులు

బాంబులను తయారుచేయు కొందరు వర్గము గానున్నారను అనుమానముతో పరిశోధించుచున్న పోలీసులకు అమృతసరుజిల్లాలో గర్గూబురా గ్రామములో ౩ శేర్ల బరువుగల బాంబుదొరకెను.

యం. యం. ఘోష్ (డిప్యూటీ మేజస్ట్రేటు) డార్జిలింగులో గారు బెంగాలు గవర్నరుపై రివాల్వరు కాల్చినసందర్భమున అరెస్టుచేయబడి యున్న భవానీప్రసాదు భట్టాచార్యుని, మరియుమువురిని జూను ౨౦ వరకు జైలులోనే ఉంచునట్లు ఆజ్ఞనిచ్చిరి. అనురేంద్రకుమారబోసు మొదలగు ముగ్గురు యువకులను జమానతుపై విడుదలచేసినను జూను ౨౦వరకు డార్జిలింగులోనే యుంచుటకు ఉత్తరువుచేసిరి. మరియిద్దరిని పోలీసు పరిశోధన పూర్తి యగువరకు జైలులో నుంచుటకు ఆజ్ఞయయ్యెను.

జూను ౭ వ తేదినాడు కలకత్తా పోలీసులు అనేకయింట్లను సోదాచేసి ఒక బాలికతో కలిసి ౧౫ మందిని పట్టుకొని పోయిరి.

## హత్యాప్రయత్నమునకై మరణదండన

జనవరి ౭ వ తేది బాంబుప్రయోగించి చిట్టగాంగుపోలీసుసూపరింటెండెంటును గాయపరచినందుకై ప్రత్యేకట్రిబ్యునలుచే ఉరిశిక్ష విధింపబడిన హరేంద్రచక్రవర్తియు కృష్ణచౌధరియు మిద్నపూరుజైలులో జూను ౫ వ తేది ఉరిదీయబడిరి. హైకోర్టు స్పెషల్ బెంచి ఏప్రిలు ౧౫ తారీఖున వారిశిక్షను సమర్థించియుండెను. హత్యాప్రయత్నమునకై ఉరిశిక్ష యొసంగుట యిదియే మొదటిపర్యాయము.

## హైదరాబాదు
## బజారు ధరలు

( కోడూరవు లక్ష్మీనరసయ్య ఉస్మాన్‌గంజి )

11—6—1934

| | | | రూ | అ |
|---|---|---|---|---|
| గోధుమలు:-శెలాల్యా మొదలుపల్లా1కి | | రు | 12 | 8 |
| బియ్యము:—దొడ్డువి | | మొ | 10 | 8 |
| నానకరాంలు కొత్తవి | | మొ | 12 | 0 |
| | | వరకు | 12 | 8 |
| డిటో | పాతవి | | 13 | 0 |
| | | వరకు | 13 | 8 |
| ,, కిచిసాంబారులు | కొత్తవి,, | | 12 | 8 |
| డిటో | పాతవి | | 15 | 0 |
| ,, రామసాగరాలు | కొత్తవి | మొ | 11 | 12 |
| | | వరకు | 12 | 0 |
| డిటో | పాతవి | | 12 | 6 |
| కందులు | పెద్దవి | | 10 | 4 |
| | చిన్నవి | | 9 | 12 |
| కందిపప్పు | పెద్ద | మొ | 14 | 4 |
| | | వరకు | 14 | 8 |
| | చిన్నవి | | 13 | 4 |
| | | వరకు | 13 | 8 |
| పచ్చపెసలు | | | 8 | 12 |
| పెసలపప్పు | | | 13 | 8 |
| నల్లపెసలు | | | 6 | 0 |
| మినుములు | | | 8 | 4 |
| మినప పప్పు | | | 13 | 8 |
| ఉలవలు | | | 4 | 12 |
| జొన్నలు | | | 9 | 0 |
| | | వరకు | 9 | 4 |
| శిరిసెనగలు | | | 12 | 0 |
| వుప్పు | | | 12 | 0 |
| తవుడు | | | 3 | 0 |
| పత్తిగింజలు | | మొ | 6 | 4 |
| అలచందలు | | | 9 | 0 |
| అనుములు | | | 7 | 8 |
| బటానాలు | | | 9 | 0 |
| బెల్లము | | | 19 | 0 |
| | | వరకు | 20 | 0 |
| ఎఱ్ఱచక్కెర | | | 20 | 0 |
| వేరుసెనగ గింజలు | చిన్నవి | మొ | 9 | 12 |
| | | వరకు | 10 | 0 |
| పసుపు | | | 13 | 8 |
| మిరపకాయలు | మొదలు ,, | | 50 | 0 |
| | | వరకు | 60 | 0 |
| చింతపండు | | మొ | 8 | 0 |
| మెంతులు మంచివి 16 శేర్లకు | | | 1 | 12 |
| అల్లం 12 శేర్లకు | | మొదలు | 1 | 8 |
| | | వరకు | 1 | 12 |
| వేరుశెనగనూనె | 12 శే | | 2 | 0 |
| | | వరకు | 2 | 4 |
| నెయ్యి | 40 శే | | 47 | 0 |
| తెల్లగడ్డలు | మొ 12 శే | | 1 | 14 |
| | | వరకు | 2 | 0 |
| ఎఱ్ఱగడ్డలు | పల్లా1కి | మొ | 5 | 0 |
| | | వరకు | 5 | 8 |
| మద్రాసు చక్కెర | దొడ్డుది | | 13 | 8 |
| సెనగలు | | మొ | 11 | 8 |
| సెనగపప్పు | | మొ | 14 | 0 |

## సంస్థానవార్తలు

## మునిసిపాలిటి అధికారులకు పోలీసు అధికారములు

### బరోడాలో క్రొత్త చట్టములు

## హరిజన సేవకునికి లాఠీదెబ్బలు

బరోడాసంస్థాన ప్రభుత్వమువారు కొన్ని క్రొత్త శాసనములను ఆమోదించినారు. ఒకక్రొత్త శాసనమును చేయుటకు ముందు ప్రజల అభిప్రాయములను కోరుచు దానిచిత్తును ప్రకటించినారు. ఆమోదించిన శాసనములలో ఒకటి, న్యాయమైనకౌలు ఏదో నిర్ణయించుచున్నది. భూస్వామికిని కౌలుదారునికిని ఒడంబడికవలన సమ్మతముగా కుదిరినకౌలే న్యాయమైనకౌలని శాసనమందున్నది. ఆయనపురికిని వివాదము వచ్చినపుడు కొన్ని షరతులపై నాయబ్ సూబాగారు, న్యాయమైన కౌలునిర్ణయింతురు. ఈతీర్పుపై మరియొకతీర్పు కోరుటకు ఎవరికినిహక్కులేదు. మునిసిపాలిటీల నిబంధనలను అతిక్రమించువారిని ప్రాసెక్యూటుచేయు అధికారము యిపుడు బరోడానగర పురపాలక సంఘముయొక్క యింజనీరింగు, ఆరోగ్యశాఖల అధికారులకు ఒసగబడినవి. స్వైరసంచారము, సాక్షులను కోర్టుకు హాజరగునట్లు చేయుటకై కొన్ని పోలీసు సంబంధములగు అధికారములువారి ఇన్స్పెక్టరుకు ఒసగబడినవి. మునిసిపాలిటీకి సంబంధించిన ప్రదేశములో మార్కెట్లను కట్టువిషయమున కొన్ని క్రొత్త నిబంధనలు తయారుచేయబడి బరోడారాజపత్రము (బరోడాజరీదా అన్నమాట) లో ప్రకటింపబడినవి. ఆనిబంధనలు సరిగా అనుసరింపబడినచో బరోడాప్రజల ఆరోగ్యము సురక్షితముగా నుండుటకు గట్టికట్టుదిట్టము లేర్పరచినట్లగును. సబ్ అసిస్టెంటు సర్జనుల జీతముల క్రమక్రమాభివృద్ధి చేయుటకు వీలగునట్లు కొన్ని పరీక్షల నేర్పరచుచు వాటి నిబంధనలు ఏర్పరుపబడినవి వీటిని ప్రభుత్వమువారు ఆమోదించగా ప్రధాన వైద్యశాఖాధికారి ప్రకటించినారు. ఇంకొక చిత్తుశాసనము దేవాలయములనుగాని, మసీదులనుగాని క్రైస్తవుల చర్చిలనుగాని, దర్గాలనుగాని, లేకయితరములైన యేమతసంబంధములైన భవనములనుగాని కట్టుటకుముందు సర్ సూబాగారి అనుమతి పొందవలయును. అట్లుపొందనివారికి ౬ నెలల జైలుగాని రూ ౧౦౦౦ ల జుర్మానాగాని విధింపబడవచ్చును. కొచ్చిను యిందూరుసంస్థానములలో అమలులోనుండు యిటువంటి శాసనమననుసరించి యిది వ్రాయబడినది. ఇదిచట్టము అగుటకుముందు ఒకనెలలోగా ప్రజలు తమఅభిప్రాయములను తెలుపవలయునట.

బరోడా సంస్థానమందు నవసారి నగర మునిసిపాలిటీయొక్క లెక్కలలో కొన్ని తప్పులు కనబడుటచేతను, అసంస్థయొక్క ద్రవ్యము కొంత హరించబడినట్లు తేలుటచేతను ఆమునిసిపాలిటీయొక్క అడిటరు అగు చిమన్లాల్ షాహాని ఉద్యోగమునుండి తీసివేయబడినారు. క్రొత్తఅధ్యక్షుని ఎన్నుకొనుటకు ఆజ్ఞయీయబడినది. బరోడా సంస్థాన స్థానిక స్వపరిపాలన [లోకల్ సెల్ఫ్ గవర్నమెంటు] శాఖలో మరికొందరు అధికారులుకూడ ఇదేవిధపు మర్యాద పొందవచ్చునని వదంతులు అధికముగానున్నవి.

ఈ సంస్థానములో పెట్లదు పట్టణముయొక్క వాణిజ్యము చాలా వృద్ధిజెందుచున్నది. ఇప్పటికే సుద్దీలకు రంగువేయు రెండు కార్ఖానాలును, రెండు ప్రత్తియంత్రములును, ఒక అగ్గిపెట్టెల కార్ఖానాయు ఉన్నవి. మరల యిపుడు కేశవ[illegible] అనుపేర క్రొత్తకార్ఖానా యొకటి పని ప్రారంభించినది.

బరోడా నగరమందలి ముసల్మానుల ప్రతినిధులుగా [illegible] రసూల్ ఖాన్ పఠాన్ (నగరములో ఒకప్లీడరు) [illegible] నాయకత్వమున ప్రస్తుత తాత్కాలిక దివానుగారివద్దకుపోయి ఖాజీ మసీదును యిపుడుండు చోటినుండి తీసివేయవలెనను ప్రభుత్వ నిశ్చయము వలన మహమ్మదీయులలో కలిగిన కలవరమునుగూర్చి నివేదించిరి. దివానుగారు శ్రద్ధతో వినిరి. బరోడా ప్రభుత్వమువారి వివేకయుక్తమైన న్యాయవిధానమును నమ్మకొని యుండవచ్చునని సమాధానమిచ్చిరి.

పరీక్షిత్లాలు మజుందారు గుజరాతీయ హరిజనసేవాసంఘ కార్యదర్శి [illegible] బరోడా సంస్థానమందలి నవసారి [illegible] హరిజనోద్ధరణ సంబంధ [illegible] అక్కడ ఒక పాఠశాల [illegible]

మజుందారుగారితోను సిటికుండెలను మైలచేసెదవని చెప్పిరి. మజుందారుగారు పోలీసు ఠాణాకు పోయినారు. అక్కడ యుద్ధము [illegible] — పోలీసువారి ఆజ్ఞచేత నేవట — మజుందారుగారిని లాఠీలతో కొట్టిరి. తర్వాత మజుందారు ఎక్కడెన్నో ఎవరుగానిలేని ఒక చెట్టుక్రిందకి తీసికొనిపోబడి అక్కడనే వదలిపెట్టబడెను. మజుందారుగారు తర్వాత ఆస్పత్రిలో చికిత్సచేయబడెను. గాయములు నయమైనతర్వాత వారు జరిగినదానినంతయు నవసారిజిల్లా సూబాగారికిని జిల్లా పోలీసు మొహతమీముగారికిని తెలియజేసిరి. ఈవిషయమై తగిన విచారణ జరుపబడగలదని తామాశించుచున్నట్లు వారు ఫ్రీ ప్రెస్సు ప్రతినిధికి చెప్పిరి.

## మేజరుగారిని తీసివేయవలెను

### సుల్తాన్పూరు కాల్పులవిచారణ కమిటీని వేదిక

కపుర్తల సంస్థానములో సుల్తాన్పూరులో మొహరం సందర్భమున ఏప్రెలు ౨౫ వ తేది జరిగిన కాల్పులనుగూర్చి విచారణపూర్తియై నివేదికవెలువడినది. కపుర్తల సంస్థాన ప్రధానమంత్రియగు సర్ అబ్దుల్ హమీద్ గారును, పంజాబు సంస్థానములలో గవర్నరు జనరలుయొక్క యేజంటుయొక్క కార్యదర్శియగు అసిస్టెంట్ కల్నల్ గ్రిఫిన్ ఐ. సి. యస్ గారును కలిసి ఒక ఉపసంఘముగా విచారణచేసిరి. సుల్తాన్పూరు కాల్పులవలన వెంటనే మరణించినవారైననేమి, తర్వాత గాయములు ప్రమాదకరము లగుటచే మరణించినవారైననేమి మొత్తము ౨౦ మంది ప్రాణములకు మోసముచేయని గాయములు తగిలినవారు మొత్తము ౩౦ మంది. విచారణ మే ౯ వ తేదినుండి ౨౦ వ తేదివరకు, అనగా ౧౨ రోజులకాలము జరిగెను. అధికారులు అనధికారులు అనేక పలువుల వారు ౧౦౨ మంది సాక్ష్యమునిచ్చిరి.

కమిటీవారు క్రింది అభిప్రాయము నొసగినారు. ఆయన (మేజర్ కొథావాలా, ఇన్స్పెక్టర్ జనరల్) ఏవిధముగా ముసల్మానులగుంపును తతిమివేసినది అనివార్యము మేము విమర్శించినాము. మొదటిమాట ఆయన ముసల్మానులను కలువనే లేదు. రెండవది ఏమనగా, ఆలస్యమువలన ఆ ముసల్మానుల మొండిపట్టుకు ప్రోత్సాహము కలుగుటకంటె వేరవిధముగ ఫలితములేనపుడు వారిని ఆలస్యము చేయనిచ్చుట, అందువలన, వారిని యింకనేమాత్రముగాని ఆలస్యము చేయనీయరాని సమయమున, అప్పటికంత సామీప్యముండునో అంతటినుండియే తుపాకులను కాల్చి వారిని చెదరగొట్టుట అవసరమయ్యెను. అప్పుడు నామకార్థము హెచ్చరికను ఒక మాటతో ముగించివేయవలసియుండును. అది ఎవరికిగాని వినబడియుండకపోవచ్చును. వారిని మొదట గుంపుగానున్నపుడు చెదరగొట్టుటకు నిశ్చయించినయెడల కాల్పులు అవసరములు కావని మేము చెప్పగలము. అయినను ముందు జాగ్రత్తకైకొనుటవలన కలుగు లాభమునుగూర్చి మేము ముందుగా సూచించియున్నాము. అప్పుడుకాల్పులు అవసరమైనను సాయంకాలము ౪॥ గంటలకు అవసరమైనంతకంటె తక్కువచాలియుండును. అనేకులు నిర్దోషులు గుంపులో నుండియుందురు. ఎంతో అవసరమగునంతవరకు తప్ప ఈలోగా గాయములను చేయుట మంచిదికాదను ఆయన అభిప్రాయమును శాసించుచును కమిటీవారు అప్పటికిని ఆయన తప్పును త్రోసివేయుటకు వీలులేదని సూచించుచున్నారు. ఏలననగా సాక్ష్యమువల్ల అవసరము ఉండెనని ఆయనకు ౧-౪॥ గంటలకే తెలిసియున్నట్లు స్పష్టమగుచున్నది. అంతేగాక ముందురోజుల పరిస్థితులుగూడ అట్టి అవసరము సంభవించవచ్చునని సూచించియుండెను. కాబట్టి మేజరుగారు ముందుగానే చర్య గైకొనియుండవలసినదని కమిటీవారి అభిప్రాయము. ఈవిధము ఆలోచనలేమండ పనిచేసినందువలనను, ఆయనను యింకను సంస్థానోద్యోగమునుంచినచో ఎక్కువమంది ప్రజలకు ఆయనయందు విశ్వాసము నశించును కనుకను ఆయనను దర్బారువారు వదలుకొనుట మంచిదని కమిటీవారు శిఫారసు చేయుచున్నారు.

మేజిస్ట్రేటు అను చౌధరి అబ్దుల్ రషీదు మేజర్ కోథవాలాకు లోబడినవాడై అస్వతంత్రుడగుటచే అతని విషయములో చర్యగైకొనుట కమిటీవారి కిష్టములేదు. ఇదేకారణముచే తక్కువ సివిలుఅధికారులుకూడ కఠిన చర్యలేకయే వదలిపెట్టబడుటకు కమిటీవారు కోరిరి.

మిలిటరీఅధికారుల విషయములో కెప్టెన్ రూపసింగును తొలగించవలసినదని శిఫారసు చేయబడెను. ఈరూపసింగుగారే ఏప్రిలు ౨౫ నాడు తుపాకులను కాల్పించిరి. కమిటీవారు కాల్పులు మితిమీరినవేయని అభిప్రాయపడిరి. అంతయు జరిగిపోయినపిమ్మట విమర్శించుట సులభమేకాని భావములు ఉద్రేకములో నుండునట్టి సమయమున తగినచర్య గైకొనుట కష్టమను విషయమును మనస్సులో నుంచుకొన్న తర్వాతకూడ ఎన్నివిధములజూచినను రూపసింగు ఇంక యేమాత్రము సంస్థానసేవలో నుంచదగినవాడు కాడని కమిటీవారికి తోచినది.

## దేవాస్ మహారాజుకు పెన్షను

### యువరాజుకు పట్టము

దేవాస్ [సీనియర్] సంస్థాన మహారాజావారికి నెలకు ౩౫౦౦ రూపాయల అలవెన్సు యిచ్చునట్లు ఇండియా ప్రభుత్వమువారు పరిష్కారము చేసినారు. యువరాజుగారు ప్రభువుగా చేయబడినారు. వీరికి ముగ్గురు మంత్రులు సహాయులుగా నుందురు. వారిలో సర్ కేఖుస్రు రాబస్తుగారు ఒకరు. యువరాజుగారు కొంతకాలము బెంగుళూరులో రాజ్యపరిపాలనానుభవమును సంపాదించుచుండిరి.

## ఝాబువా మహారాణి మొఱను గూర్చి ఇండియా ప్రభుత్వ విచారణ

### మహారాజును తొలగింపవచ్చును?

ఝాబువా మహారాణి మహారాజునుగూర్చి కావించిన మొఱను విచారించుటకై యిండియా ప్రభుత్వమువారు పొలిటికల్ ఏజంటును ఆజ్ఞనిచ్చినట్లు అనుకొనుచున్నారు. పొలిటికల్ ఏజంటు ఇండూరులో తనను కలిసికొనవలసినదిగ మహారాజును పిలుపుపంపెను. మహారాజు యింతవరకు కలియలేదట. తనకుబదులు ప్రధానమంత్రిని పంపెనట. ప్రధానమంత్రికిని పొలిటికల్ ఏజంటునకు ఏమి సంభాషణలు జరిగెనో తెలియుటలేదని ఫ్రీ ప్రెస్ పత్రిక వ్రాయుచున్నది, మహారాజుగారిని సింహాసనమునుండి తొలగించువిషయమై ఆలోచించబడెనని ఫ్రీప్రెస్ పత్రిక యితరులద్వారా తెలిసికొన్నదట. ఈ ఝాబువా సంస్థానములో పరిపాలనము బాగుండని కారణముచే యిదివరకు ఈమూడుపర్యాయములు మహారాజా సింహాసనమునుండి తొలగింపబడిన సంగతి అందరికిని తెలిసినదే.

జోద్పూరు మహారాజాగారు రేవా సంస్థానమునకు పోవుచున్నారు. సాధారణముగా ఒక సంస్థానాధిపతి ఇంకొక సంస్థానమునకు పోవుటకు బ్రిటిషు ప్రభుత్వమువారి యనుమతి పొందవలెను.

### కపుర్తల సంస్థానములో యింకను ఆందోళనము

కపుర్తల సంస్థానములో యిప్పటికిని అన్నితెగలవారును అసంతృప్తులైయున్నారు. జూను ౫వ తేది కపుర్తలలో ముసల్మానులు శాసనవిరుద్ధముగా ఊరేగింపుజరిపిరిగాని పోలీసువారు చర్యగైకొనలేదు. ముసల్మానులు సుల్తానుపూరు కాల్పులవిషయమై నిష్పక్షపాత విచారణ జరుగువరకు ప్రతిశుక్రవారము హర్తాలు జరుపుటకు నిశ్చయించినారు. ఉన్నది ఉండగా మరల ఫగ్వారాలో ఒకగలభా. ప్రధానమంత్రి ఆచటి హిందువుల ప్రతినిధులను తనతో మాట్లాడుటకు రమ్మని పిలిపించెను: కాని వారు ప్రస్తుత ప్రధానమంత్రిగారివిధానము హిందువులయెడ ప్రతికూలమైనదిగా నున్నదను కారణమున కలిసికొనుటకు నిరాకరించిరి. మే ౨౬ నాడు ప్రధానమంత్రిగారు ఇతరమంత్రులతోను, గవర్నరుజనరలు ఏజంటుయొక్క కార్యదర్శితోను ఫగ్వారాకుపోయి అక్కడ హిందువులతోను, గవర్నరుజనరలు ఏజంటుయొక్క కార్యదర్శితోను సిక్కులతోను, ముసల్మానులతోను సంభాషించిరట. ఆఖరుకు ఫగ్వారా తహశీల్దారును తొలగించ నిశ్చయించుకొన్నట్లు తెలిసినది.

### సంస్థానమునుండి తరిమివేయుట

ఘనతవహించిన ఇండూరు సంస్థాన మహారాజాగారు ఇదివరకు సంస్థానములో పనిచేసియుండిన ఒక రిసాలాను మంచివాడుగాదని అతనిని తమసంస్థానమునుండి తరిమివేసిరి.

## గాంధి స్వాగతసంఘ నిషేధము

### జోధపూరు పోలీసుల లాఠీలు

గాంధిమహాత్ముడు కరాచీకిపోవునప్పుడు మధ్యలో జోధపుర రాష్ట్రములో పోవుచుండా పోవలసివచ్చును. అప్పుడు అక్కడివారికి ఏవిధముగా స్వాగతమీయవలెనని విచారించుటకై జోధపురములో ఒకసభ జరుపబడెను. సంస్థానాధికారులు ఆసభను నిషేధించిరి. పోలీసువారు రంగమునకు లాఠీలతో వచ్చి సభను చెదరగొట్టిరట. ఆసంస్థానములో పలువురు అస్పృశ్యతా నివారణమునకు ప్రతికూలురు కావున ద్వివిధాభిప్రాయ సంఘర్షణచే శాంతికి భంగము కలుగవచ్చునని భయపడి పోలీసులు అట్లుచేసిరట. మణిలాల్ వి. కొఠారిగారు మహారాజాగారికి ఒక టెలిగ్రాము పంపి ఈ సందర్భమున అధికారుల చర్యను నిరాధారమనియు సంస్థాన ప్రజలు అస్పృశ్యతానివారణకు అనుకూలురనియు వ్రాసినారట.

## ది సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా, లిమిటెడు.

| | | |
|---|---|---|
| మూలధనము | ... ... | రూ ౩,౩౬,౦౦,౦౦౦ |
| వసూలయిన మూలధనము | ... ... | ౧,౬౭,౦౦,౦౦౦ |
| నిధి | ... ... | ౭౦,౦౦,౦౦౦ |

### భీమా పద్ధతి

సెంట్రల్ బ్యాంకు సేవింగ్సు బ్యాంకులో డబ్బు దాచిపెట్టుకొనువారి ఉపయోగార్థమై మేము నెలకు రూ. ౧-౪-౦ రూ ౨-౦-౦ అంతతగ్గు మొత్తపుప్రిమియములతో రూ ౫౦౦లు, రూ ౧౦౦౦లు విలువగల పాలిసీలను క్రమముగా యివ్వగలము.

### చెక్కులద్వారా సేవింగ్సు బ్యాంకులెక్కలనుండి తీసికొనబడుట

మా కస్టమర్లయొక్క అనుకూలమునకై క్రొత్త సేవింగ్సు బ్యాంకునుప్రవేశపెట్టినాము. అందుండి డబ్బును చెక్కులద్వారా తీసికొనవచ్చును.

వివరములకు **ది సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ యిండియా** కు వ్రాయుడు.

రెసిడెన్సీరోడ్డు, హైదరాబాదు (దక్కన్). జేమ్సుస్ట్రీటు, సికిందరాబాదు (దక్కన్).

---

### పాలిసీలు హోలీనాణెములో నివ్వబడును

స్టార్ 'పాలిసీలు రద్దుకానేరవు. పట్టాలు హాలీలో జారీచేయబడును. అపాయకాల విస్తరణ, ఆకస్మికప్రమాద మరణము వలన రెండింతలలాభము, శాశ్వత అశక్తతలాభములు, నగదుగామైన నరెండరువిలువలు, గ్యారంటీ చేయబడిన బోనసులు, యింకను యెన్నియో లాభములు గలవు. వివరములకు వ్రాయుడు.

### స్టార్ ఆఫ్ యిండియా ఐ. జి. అస్యూరెన్సు

కంపెనీలిమిటెడ్ (మదరాసు)

బ్రాంచి:—హనుమకొండ (దక్కను)

పి. యస్. శాస్త్రి,
నిజాంరాష్ట్రమునకు
డివిజనల్ ఆర్గనైజర్
c/o గోలకొండ పత్రిక

—చదువుకొన్న ఏజంట్లు కావలెను.—

---

### అపాయ శకునము

భోజనమునైన అనిచ్ఛ, అజీర్ణము, వీర్య నష్టమువలన శక్తితగ్గుట, మనస్సులో వ్యథ, మలబద్ధము మొదలగునవి అపాయశకునములు

రోగియొక్క శత్రువు అతని అమూల్యమైనజీవితమును నాశముచేయుటకు త్వరత్వరగా సమీపించుచున్నాడని ముందుగా రోగికి హెచ్చరించుటకు ఇవి చాలును.

పైజెప్పినట్టి బాధలలో ఏదిగాని నీదురదృష్టమువల్ల నిన్ను బాధించుచున్న చో నీజీవితమును నీకును, నీకుటుంబమునకును, నీదేశమునకునుకూడ ఉపయుక్తమగునట్లు చేసికొనుటకు

### ఆతంకనిగ్రహమాత్రల

వలన రక్షణము పొందుట మంచిది
౩౨ మాత్రలుగల డబ్బా ౧కి వెల ౧-౦-౦

**ఆతంకనిగ్రహఫార్మసి,**
హెడ్ ఆఫీసు:
జమ్నగర్ (కథియవార్)
బ్రాంచి ఆఫీసు:
౨౭, బ్రాడ్వే, మద్రాసు.

---

వచ్చినవి! వచ్చినవి!

### సావిత్రినాటకము రికార్డులు

౬ రికార్డులలో పూర్తి నాటకము. ఈస్టిండియాఫిలింకంపెనీవారి "సావిత్రి. ఫిలిములందు సత్యవంతుని పాత్రనుధరించిన శ్రీయుత నిడుముక్కల సుబ్బారావు సత్యవంతుడు; బ్రహ్మశ్రీ చోప్పల్లి సూర్యనారాయణ భాగవతులు యముడు, ఆంధ్రదేశమందంతటను పేరుమోగుచున్న డి. సుబ్బులు సావిత్రి; శ్రీమతి ఎస్. రాజరత్నం నారదుడు; హాస్యకళానిపుణులగు శ్రీయుత కే. పూర్ణచంద్రరావు: ఇట్టియపూర్వ నటకులసమ్మేళనముచే తయారుచేయబడినది. వెల పూర్తి రికార్డులసెట్టు ౧కి రూ ౧౬-౮-౦ వి. పి. ద్వారాపంపబడును.

అడ్రసు:— బి. జి. చిమలిగి
గౌలిగూడ-హైదరాబాదు (దక్కను)

---

### గోలకొండపత్రికా కార్యాలయమున వెలకుదొరుకు గ్రంథములు

| | |
|---|---|
| హిందువుల పండుగలు | 1-8-0 |
| ఉచ్ఛల విషాదనాటకము | 0-12-0 |
| శిశురక్షణ | 0-12-0 |
| కృష్ణార్జున సంవాదము | 0-6-0 |
| సంఘోద్ధరణ | 0-6-0 |
| కర్నూలురాజ వంశావళి | 0-2-0 |
| కృష్ణాలహరి | 0-1-0 |
| సుధాలహరి | 0-2-0 |
| జీడికంటిరామ శతకము | 0-1-0 |
| బమ్మెరపోతనామాత్యవిజయము (హరికథ) | 0-1-6 |
| తిప్పన్న చరిత్ర | 0-0-6 |
| రఘునాథ | 0-1-6 |
| చారుమీనారు | 0-1-0 |
| పంచముల చరిత్ర | 0-3-0 |
| హాలీకల్దారు జంత్రి | 0-2-0 |
| కొత్త కుటూలియ్యతులు 100 కి | 2-0-0 |
| ప్రాంసరీనోట్లు ,, | 2-0-0 |

వలయువారు:—
గోలకొండపత్రికాలయము త్రూపుబజారు
హైదరాబాదు (దక్కను)

---

చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును (గనేరియాశగ) వ్యాధికిని

### క్రొత్తగా కనిపెట్టబడిన దివ్యౌషధము

## గనో కిల్లర్ (రిజిస్టర్డు)

కృత్రిమములు చూచి మోసపోకుడు.
"కోడి" మార్కు గమనింపుడు,

ఈ యౌషధము ఇంగ్లీషు మందులను దేశీయ ఔషధములను పుచ్చుకొనినను గుణము కలుగని యెడలను, యింజక్షనులవలనను వాక్సీనులవలనను గూడ లాభము లేకపోయిన యెడలను కడపటి ప్రయత్నముగా మా గనోకిల్లరును గూడ పుచ్చుకొని చూడుడు. పెక్కుయేండ్లనుండి యున్నను లేక క్రొత్తగాకలిగినను ఏరకము శగసంకటమైనను మరెట్టి మూత్రవ్యాధులనైనను స్త్రీలకైనను పురుషులకైనను గనోకిల్లరు తప్పకకుదుర్చును. మూత్రము స్వచ్ఛముగా వెడలును. మూత్రముపోవుచున్నపుడు కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళమునందలి వాపు తీసిపోవును. శగవ్యాధి(గనోరియా) వలన మూత్రము బొట్టుగాపడుట మేహరోగమువలన మూత్రద్వారమునుండి పోవు తెలుపు, మూత్రద్వారము యొక్క వాపు, మూత్రద్వారముయొక్క చుట్టువుండు పొరయొక్కవాపు, మూత్రాశయముయొక్కవాపు, లేక మూత్రతిత్తియొక్కవాపు, నరములజబ్బు, మున్నగువ్యాధు లన్నియును స్త్రీలకును పురుషులకును గూడ గనోకిల్లరువలన కుదురును. వీర్యము (సెగను) పోవుట, మూత్రవ్యాధులు మున్నగునవికూడ దీనివలన కుదురును. ౫౦ మాత్రలుగల సీసా ఖరీదు రు. ౩-౦-౦ వి. పి. చార్జిప్రత్యేకము.

కృత్రిమములుచూచి భ్రమజెందవలదు. మా "పుంజు" మార్కు గమనింపుడు.

అడ్రసు:— డాక్టరు డి. యన్- జస్నాని గిర్గానువెనుక రోడ్డు బొంబాయి ౪.

Agent:—D. J. PARIKH & Co, Station Road, Secunderabad

## వర్తకులకు లాభము

గోలకొండ పత్రికయందు ప్రకటనవేయించి మీవ్యవహారమునందు లాభముపొందుడు. ఈపత్రిక నిజాంరాష్ట్రమునందంతటను బ్రిటిషిండియాయందును విరివిగాప్రచారముచేయుచున్నది. ప్రకటనరేట్ల వివరములకు:— "మేనేజరు గోలకొండపత్రిక హైదరాబాదు, అని వ్రాయుడు.







Printed and published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K. Balakrishna Reddy